

*Dedicated To*

**SRI THANGIRALA VEERARAGHAVAIAH**

*Zamindar*

*of*

AMPAPURAM, CHINALINGALA ETC., ESTATES.

***General Superintendent of Branches & Agencies***

**NATIONAL INDIAN LIFE INSURANCE**
**COMPANY, LTD.**

# అంకితము

లేమ కృష్ణ కౌగిలింప వార్నిధి నెడ
మాయె 'అవనిగడ్డ' నాయకమణి
దాని కాంతిచయము, తత్రత్య వేద వే
దాంగవిన్మహాద్విజాళి గాఁగ

ఇది వేదభూమి యిచ్చట
మొగలిచదువు దివ్వెవెలుగు ముడుగకయె పదిం
బది చమురు పోసినట్టిరు
వృదాకు పరివృఢసమాన వెలనాటి ద్విజుల్

అమృషావాదు లకుత్సితుల్ హుతభుగర్చాధీన ధీసర్వో
త్తమపాండిత్యులు సంప్రదాయమతు లద్ధాశీలు రానంద వి
క్రము లాదేష్ట లనీచబుద్ధు లసమాక్రాంతుల్ మహోదారు లా
శ్రమబద్ధుల్ వెలనాటు లాంధ్రజనకాసారాంబుజాతాకృతుల్

'తంగిరాల' పేరి వంగసంబున సోమ
యాజి పౌండరీకయాజివితతి
యవనిగడ్డయందు నాది దీక్షితవాద
సంప్రదాయభృత్ప్రజాపతితతి

సూరిమాళి సుబ్రహ్మణ్యసోమయాజి
మూలభూతుండుగాc దంగిరాల వంశ
కల్పవృక్షు మాగ్నీధ్రప్రకాండ మయ్యె
విస్ఫురద్ద్విజశ్రేణి తర్పితము గాcగ

భార్గవుడు చ్యావనుం డాప్నవానుc డౌర
వుండు జామదగ్న్యుం డయి పొలిచి తంగి
రాలకులము పంచార్షేయ ప్రథిత మగుచుc
గోటి కెక్కె శ్రీవత్సస గోత్ర మగుచు

వారిలోన రామసుబ్రహ్మ పౌండరీక
యాజి ప్రగ్రహధృత మనోవాజి నవత
టాకనిర్మాత మధుమధురాంబుదాత
దాత యీ కృతినేత ముత్తాత తండ్రి

కలి ముదిరి వేదవిద్యపై గౌరవంబు
పోషణంబును దక్కువై పోయి కావ్య
జాని తండ్రి శ్రీ రామావధానిగారు
బ్రదుకుకత్తె రెండవవైపు పదును పెట్టి

ఇటు చెఱువులు త్రవ్వించెను
అటు చరువుల పావిసు వేల్చె స్వాధ్యాయ సదా
స్ఫుటవాణి జనము మెచ్చఁగఁ
బటువగు లౌకికముగూడఁ బరిపాలించెన్

ఆ మహాత్ము భార్య రామ సీతాదేవి
యాలు మగలు తృప్తితాత్ము లగుచు
ముగురుసుతులఁ గనిరి మూఁడవపుత్త్రుఁ డీ
రమ్యకావ్యభర్త రాఘవయ్య

జరయు మృతియు లేక చనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్య కూర్పఁ దలఁపవలయు
ధర్మ మాచరింపఁ దగు మృత్యుచేఁ దల
పట్టి యీడ్వఁబడినవాఁడువోలె

అన్న నన్నయ్యగారి వాక్యంబునకును
లక్ష్యభూతంబుగాఁగ నిలం జరించు
తంగిరాల కులాబ్ధి సుధాకిరణుఁడు
రమ్యగుణశాలి శ్రీ వీరరాఘవయ్య

మఱియుఁ గొందఱు ముట్టిన మట్టి యేను
పైడి రాఘవు హస్తంబు పరుసవేది
బంధురాజికి నితఁడు సౌభాగ్యవేది
బ్రాహ్మణశ్రేణి కితఁడు ప్రపావివేది

ఆరామాదిక ధర్మ
ప్రారంభవిభాసి రాఘవయ్య త్రియా వి
ద్యారక్షసేయుఁ దొలిమే
లూర్కారఁగఁ గలిమొగము రంగులో ముంచునటుల్

మధురహాసన గల్లాకృతి
విధుమతి వేదార్థనిధి వివేకసటద్రాభ
పృథుగతి 'కుప్పా లక్ష్మా
వధాని' తత్పాఠశాల పరిపాలింపఁ

ప్రకటమతి రాఘవ ల
క్ష్మీకామేశ్వరుల గర్భమేదిని సస్య
శ్రీకోమల మగుఁగావుత!
చేకొని తత్కీర్తి తెలుపుసేయుత దిశలఁ

ఓం.

# శ్రీ వల్లీదేవసేనావిజయము

పన్నిద్దరైనట్టి భాస్కరుల్ పొడిచిరో
యనఁ గాంతు లుమిసెడు కనులవాఁడు
కూయగా నిక్కిన కుక్కుటస్వామినా
గ్గ్రంచు ఫాలభాగంబువాఁడు
శక్తి యింకెక్కడ సముకూడు నన్నట్టు
లమరిన బాహుదండములవాఁడు
కాలిపిక్కల వెండ్రికలు నెమ్మికన్నుల
జిలుగు జగాజిగుల్ చిమ్మువాఁడు

అతని తేజమ్మె యర్థమైనట్లు వానిఁ
వంకఁ గాంచిన శౌర్యశబ్దము స్ఫురించు
నట్టి యొక్క కుమారుఁ డిందావసథము
చిత్రమగు సావడిఁ బచారు చేయుచుండి

తనుఁ బిలిపించి యింద్రుఁడును దారకదైత్యునినుండి యెల్ల పృ
థ్విని గెలువంగ నా పనిసఁబెట్టెను వేలుపుసేన యొక్క దా
రిని జనకుండెఁ దన్నును వరించెఁ జమూపతి నిట్టి క్లిష్టమై
న నిముసమందు నాయన మనస్సు మనస్సున లేకయుండఁగా

వానకాల మన్న భ్రాంతి సందీపించె
నింద్రుమేడ నెరిగె నింతలోన
నల గవాక్షమందు నరసె నొక్క లతాంగి
తన్నుఁ గాంచుచుండఁ గన్ను లుంచి

తానుగూడఁ గన్నుఁ దరలింపకయ చూడ
నామె మొఱఁగి చనియె నచటినుండి
యంత నా గవాక్షమంత శూన్యం బయ్యె
నతని యెడఁద శూన్య మయినయంత

ఇంతలో నింద్రుఁ డరుదెంచి యేమి స్వామి
యనిన నేమి స్వామీ యనె నా కుమారుఁ
డతనిమూర్ఛాసమంబైనయట్టిస్థితికి
మఘవుఁ డాందోళనం జెంది మనసునందు

దిగ్గున నెవ్వరేఁ జలము తెండని పిల్చెను వేల్పుఱేడు నా
దగ్గర నున్న యా మెఱుపు తా జలకుండిక తెచ్చి నిల్వఁగా
సిగ్గున దాగుచున్ గనులచెంతలఁ గాంచెద రొక్క రొక్కరున్
దగ్గరనుండి మోహితంబున దవ్వులనుండిన యట్లు లెంచుచున్

వినయముచేతఁ బాత్రి నటఁబెట్టి వశానమయాన యేగె గ
మ్మనెవ మున సుగ్గబట్టిన కుమారుఁడు నేటు యెఱుంగనట్లుగాఁ
గనులను నీగ మద్దుకొని కన్నుల తెల్వెగ నేవా విచ్చిపో
యిన తెరయట్లుగా నభినయించుచుఁ జేసెఁ జపూపప్రసంగముల్

సావడిలో లేని స్వామికై ముక్త ×
వాక్షంబునందు పరీక్ష సలుపు
కనకపాత్రికతోడఁ గైకొని జల మూర
కయ పోవుఁ జావడి గడపదాఁక
కడఁగి యుద్ధప్రసంగములు పల్కెడు శుకీ
వ్యాహారములు శ్రద్ధ నాలకించు
వినయాన నటనుండి వెడలెడు గతివశా
సమవైఖరీ మంధరముగ నడచు

పగటనే కోడికూసినపగిది ప్రికక [?]
మీఁదినుండి హఠాత్తుగా మేలుకొనును
తన చదువుచున్నయట్టి గ్రంథంబు మొదటి
దాపుటయుఁ దిరుగద యెంతసేపటికిని

ఇట్టుల నుండికూడఁ బ్రభు వింటికి వచ్చినవేళఁ జావడిం
బట్టుకు స్వామి యే పనియుఁబట్టక వచ్చుచు నుండె నైననా
ళిట్టుల సాగఁగా నెడఁద నిద్దఱును న్నిలుపంగలేక నా
డెట్టులనైన కోర్కె నెలయింపఁగ సాధ్యముకాక యొక్కటన్

కౌగిలించినంతగా నెట్టయెదురుగాఁ
కలసికొనిరి లోనిగడపమీఁద
కౌగిలించునట్లు కరములు నెత్తిరి
వినయభావమునను వెనుకఁబడిరి

స్వామి యడిగెను నీదు పే రేమి యంచుఁ
జెలియ చెప్పెను మఱి దేవసేన యంచు
ఇద్దఱును నవ్వినంతలో నెన్నినాళ్ళ
దైనదో యొక్క పరిచయ మవతరించె

ఇరువురు సాధునాగరకవృత్తులు కోర్కెప్రసక్తి లేక సం
గరమును నందులో మఘవు కార్యము తారకు గెల్చు నీతిలోఁ
దెరువులు ముచ్చటించుచు నతిప్రమదాకృతి ప్రొద్దుపోయి యం
బరమునఁ జందమామ కనుపట్టిన నట్టులె మాటలాడుచున్

ప్రొద్దుపోయి వేలుపుల ఱేడు వచ్చిన
యపుడు నట్లె మాటలాడుచుండ
వారి యింతయైన పరిచయం బంతలో
నెట్టులయ్యో మఘవుఁ డెఱుఁగలేడు

చదు విద్దఱకును జుట్ట
మఱది యెఱిఁగిన యంతలోన నాప్తత కలుగున్
హృదయములు మున్నె విద్యా
సదనంబున [illegible]సియున్న స[illegible]లుగాన్

మరునాడు కలసికొనఁగా
నిరువురు విడిపోయి రిద్ది యేమి విపట రా
తిరి తెలవారుట తప్పని
సరిగాఁ దెలవారె సురల స్వామియు వచ్చెన్

స్వామిదెస నామెయొక పరిచర్యచేయు
నామెదెస స్వామి యొక్క-స్వామ్యమ్ము నెఱపు
పైకి నెయ్యమ్ము లోపలిభావ మేమొ
పొంగక జగదంతర్యామివోలె నుండు

పోవ నిష్టము లేకయుఁ బోవఁ దప్ప
కొక దినంబున స్వామియు నూరి కేగ
నాల్గుదినములు నుసలులైనదియు నచట
నంత పనిచేయుటకు మనసాడకుండ

ఇచ్చట దేవసేన ప్రభు వేగిన సంగతియే యెఱుంగకన్
వచ్చు నటంచుఁ జూచి మఱి వచ్చుట కన్పడ కెంత వేళకున్
గ్రచ్చుఱఁ దాను శాపియెడ రా నని చెప్పుట యేమి తప్పు నా
మచ్చరికించి రేపటికి మత్సరమున్ విడి యేమి తోచకన్

తనఁగోన మాకందతరుకిసాలయ మేలో
యురక కోపించునం చూహాసేయు
దూరానఁ గోకిల వైరానఁ గవ్వించు
పద్ధ[illegible]గ భావన [illegible]ర్చి

చలువ జాబిల్లి వెల్లుల వేగమున నిల్వఁ
ద్రొక్కికోలేనట్లు తూలిపోము
అది యెన్న డనుకోనియది నులయూచలా
నిలము కవోష్ణము న్తలపు గలిగి

ఏదో గ్రంథమ్ము చదువఁగా నెంచుటకును
దానిపై సుంతకొఱఁ గంథమ్మె లేక
కొడికూయుట విన్న మేల్కొలుపఁగాక
తెలిసికొనె నూగకయు యంచు దేవసేన

ఒడలు పులకరింప నూహించి కారణం
బతనిఁ గూర్చిన యూహ యంచుఁ దెలిసి
ఎవ్వరో యడిగిన నేదియో మారు చె
ప్పఁగవచ్చు స్వామియ న్పలుకు వాపి
నెమిలంచుచీర యుండిన దొకఁటే దాని
వదలక తొలిచి పవలు నిశలు
ఉలక యేదో గీయచుండి యాఅవ సంఖ్య
కృతసహస్రంబుగా గీసి తెలిసి

అమరనాథునిఁ దనసేవకాళి స్వామి
యంచు నాడిన హృదయంబునందు నురిసి
తెలియరానట్టి బాధగా దేవసేన
నాలుఁగుదినాలు నాల్గుయుగాలుగాఁగ

ఐదవనాడు ప్రాంగణమునందున నా నిలుచున్నయట్లు చం
ద్రోదయవేళదాఁక నిలుచుండి సురేంద్రుఁడు పీట లేకపో
గాఁ దనుఁ బల్కరించుటకుఁగాని భయంపడియుండ సేవకుల్
సూదులవోలె గ్రుచ్చుకొనుచుఁ వెలివెన్నెల స్రుక్కఁజేయఁగా

కనులు తెఱచియుండెఁ గాని వచ్చెడునట్టి
మనిసి నెఱుఁగుతెల్వి తనకు లేదు
అంత స్వామి వచ్చె సఖులలోఁ బ్రాణ
మున్నవాఁడు తూలుచున్నవాఁడు

వచ్చి దేవసేనప్రక్క కూర్చుండెను
తనువు తనువు నానుకొను విధాన
వెచ్చనైనయట్టి వేసంగివెన్నెల
సన్న సన్నగాఁగఁ జల్లనయ్యె

చెక్కిలి చెక్కిలి నానిచి
యొకరిభుజమందు వ్రాలి యొకరు కరములఁ
నొక్కుచు భుజముల మనసుల
స్రుక్కినతన మెల్లమాన్చి సొక్కిరి తుదకుఁ

స్నేహము చిత్రమైనయది చిత్తము లెంతటి దగ్గరైననుఁ
దేహము లంత దగ్గరకుఁదెచ్చుట కింకొకవేళ కావలెఁ
సాహసకార్యమౌఁ బెఱల సజ్జనులం దెడఁబాటుకాక స
[illegible]మైన చిత్తముల యూపుట దగ్గరసేయు మేనులఁ

శ్రద్ధగా నీతిశాస్త్రగ్రంథ మొక్కండు
స్వామియుఁ గూర్చుండి చదువుచుండ
అతని బుజంబుపై నానిచి చిబుకంబు
దేవసేనయు దానిఁ జూచుచుండె
స్వామి వామకరంబు పైకెత్తి పాయను
మెడకును దగిలించె మెలికగాఁగ
ఆ సమయంబున నరుదెంచె నింద్రుండు
నింద్రుని రాక వారెఱుఁగలేదు

అమరనాథుండు నిస్తబ్ధుఁడై యొకింత
యంతలోఁ జిఱునవ్వున నచటినుండి
వెనుతిరిగి సద్దుసేయక వెడలిపోయె
భయముచే నట్లు నిట్లు సేవకులు తొలఁగ

ఒక్కదినంబున స్వామియు
నక్కలికిం గాంచి నీకు నమృతదృశాంతా
చిక్క యహల్యాజారులు
నెక్కడి జనకులు వచింపవే యని యడుగఁ

తమ రేమొ వేదమూర్తులు
నమరేశ్వరు నట్టు లనుట యది మీకె తగుఁ
తమరిని సేనాపతిగా
నంచు మరి యందుకేగదా శివమూర్తీ!

తనర నరిష్టనేమి యను దానవనేతకు రెండుకన్నులై
తనయులు గల్గి రిద్దఱు మృతామృతబుద్ధులు దైత్యసేన కో
పన, దను నీతిశాస్త్రమునఁ బండితురాలయి దేవసేనతో
ననయము మచ్చరించుఁ గలితామరనీతిమతిప్రగల్భతో

కడునడిఁ బాపముల్ కలిపికట్టిగఁ గట్టినయట్టివాఁడు దై
త్యుఁడొకఁడు కేశినామకుఁడు దుష్టసురారి నయపరిహార లు
బ్ధుఁడు మఱి దేవసేనపయిఁ బూనిన మత్సరభావ మొప్ప న
ప్పడఁతుక కెట్టులైనఁ బరిభావము సేయఁగ నెంచు నిచ్చలున్

జనకుఁ డరిష్టనేమి దితిజప్రభునీతిని దోషసంచయం
బను వచియించు నయ్యఖిలమున్ దనకూఁతురు దేవసేన నే
ర్పిన దని వ్యాఖ్యసేయుదురు వేదురుఁబొందిన సర్వదైత్యు లం
తన మఱి దేవసేన యన దానవజాతికి గుండెమంటయై

వ్రాలి యొ దేని దుష్టమగు రాక్షసనీతిని జూపు గూఢమా
వేశను దేవసేన గొని పెట్టుచు నుందురు కారలోన న
య్యాలరిచేతలోని దగు నర్థము స్పష్టముచేయు నంచు నీ
లీలను సేవఁ దట్టుకొనలేక యెటో వధియింప నెంచుచున్

అమరశ్రేణిని దానవావళికి నాహారంబుగా సృష్టి చే
సె మరిం దైవ మటంచు వారి దసలౌసిద్ధాంత మామాట స
త్యముగాఁ గొందఱు దేవతల్ నడువ నా దైతేయసంతాన మ
క్రమమార్గంబునఁబట్టి బిట్టు మితిమీఱన్ నేను దుఃఖించితిన్

విష్ణువే రాముఁడో యయి పృథ్విఁబుట్టి
సర్వరాక్షససంతతి సంహరించు
నసురు లందఱు చావనియట్లు నేను
క్రొత్త యొకనీతి కల్పించికొంటి నెడఁద

సర్వసృష్టియందు సతిపైన సంతతి
పైనఁ బ్రేమ లేనివారు లేరు
ప్రేమ యెచటఁ గలదు హృదయంబునం దుండె
త్రివ్వి తీయఁదగినదానియందు

దయ ప్రేమయొక్క రూపము
దయ పుట్టగఁ జాలదవ్వు త్రివ్వఁగవలయుఁ
దయ పుట్టె నేస రాక్షస
చయ మైనను వేల్పు లగుట సమకూడుఁగదా

శతధృతిఁగూర్చి నేఁ దపముసల్పితి నన్నును గొంచుఁబోయి దే
వతలను నొక్కసూరునకు భార్యను జేయు మటంచు నాతఁ డి
చ్చితి ననేఁ గేశి నా తపముసేఁత నెఱింగి య దేమొ కీడు కో
రితి నని నేను వారికి దరిద్రుడు నన్ను హరింప నెంచుచుఁ

నన్ను నిద్రపోవుచున్నట్టి దానిని
నెత్తుకొంచు మింట నెగిరిపోవ
మింటియందు నాకు మెలఁకువవచ్చి నే
నరచుచుంటి భయమునంది బిట్టు

కాశికిం బోయి యచట విశ్వేశుని
జరిపి మింటను వచ్చెడు హరిహయుండు
నఱపులఁ విని వచ్చి వజ్రాయుధమున
చండవేగుని కేశిని సంహరించె

నన్నుఁ గూర్చి మున్నె విన్నాడు నే నని
తెలిసి సంతసించి తెచ్చినాడు
ఆతనికిని నేను కూఁతుర నైతిని
నాటనుండి స్వామి నేటివరకు

నేటినుండి యింక నీ వేమి యౌదువో
చెప్పు మన్న దేవసేన నవ్వెఁ
గాని తండ్రి యీయఁగావలెఁగద తాన
యనిన స్వామి తాన యడుగ ననియె

ఒకపని చేసిపెట్టి ధర నొక్కని కోరినఁ గోరవచ్చుఁ దా
రకుని జయించి పోయి యమరప్రభు నే నిఁక దేవసేనఁ బొం
దక బ్రదుకంగలే ననినఁ దా నమరేశ్వరుఁ డీయవచ్చు నా
రక చని యిమ్మంటచడుగరా దడుగంజుమి నే సురేశ్వరుఁ

మా యింటికి రా! పోదము
మా యమ్మను జూతుగాని మా యమ్మ యనఁ
మా యమ్మ యనంగా నీ
వే యెఱిగెదు నేను చెప్ప నేలే సేనా!

అనిన నిట్లనె నవ్వుచు నంబుజాక్షి
అత్తగారేమొ పరమదయాసముద్రు
రాలె మీ నాన్నగారికి వ్రాలి మ్రొక్క
పైన నుందున టందురు కోపంబు స్వామి!

భూరిమలినంబుగాఁగఁ బెడమోముగ నిశ్చలదృష్టిరేఖగా
స్వామియుఁ గూరుచున్న నవవారిజలోచన యేగి స్వామి బా
హామృదుదండముఁ గరమునం దెమలించి యిదంతకోపమే
నా మఱి నవ్వుటాల కనినఁ సిగబారెదు చేసికొందురా?

మఱియు స్వామియుఁ గోపంబు మానకున్న
దండ్రి యనుమతి వలదు పద చనుదెంతు
ననిన స్వామియు లేచె, వెంటనె లతాంగి
యతనిబడి యేగె విడిచీరయైన లేక

ఊరితుదిదాఁక జని పొలిమేర దాఁటి
కమ్మని పొలాలనడుమగాఁ గాలిబాట
వెడలుచుండిరి మును స్వామి వెనుక సేన
బాటవెంబడి నొకమాట పలుకు లేక

ఎచటనుండియో వచ్చెడు నింతలోన
నెట్టయెదురుగ నమరలోకేశ్వరుండు
నాయనంగాంచి కళవళ మంద స్వామి
కారణ మెఱుంగలేదయ్యె సౌరపతియు

ఇరువురినంకేఁ గన్గొనగ నిర్వురు పల్కరు కొంతవేళకుఁ
హారిహాయుపాదయుగ్మమునయందున వ్రాలెను దేవసేన యా
హారికిని నప్పు డర్థమయి యాస్యమునం జిఱునవ్వుతోడఁ దాం
దరపడి రిద్దఱుఁ సరి పదం డని ముందున కేగి వెన్కకుఁ

మరలి యిటు లనె శూరపద్మాసురుఁ వ
ధించితివి స్వామి! నీ కిచ్చి దేవసేన
పెండ్లి సేయంగ నెంచితి వెడలి బ్రహ్మ
తోడ వచియించి వచ్చుచున్నాడ ననుచు

ధృతి నారగ్వధబాలపత్రికసితశ్రీ పొల్చు చిర్నవ్వులన్
బృతనాసాహసుఁడు వెళ్ళిపోవఁగ భుజావేల్లల్లతా తన్వియై
శితికంఠప్రియసూను డేగ దెసలన్ క్షేత్రంబులం గంకె ల
చ్యుతుఁడై కోయుచు నూచబియ్యమునుదించుం బాటలం బాడుచున్

ఇది సేనాసమీకరణ మను
ప్రథమాసనము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా విజయము

ఉడుకఁగఁ బెట్టునో ప్రాయి నహా యొకగిద్దెడు బియ్యమైన బిం
దెఁడు జలమైనఁ దేఁగలుగునే యిది యే ద్వార కన్నకూఁతురో
లొడ్డితెఁడు లేదు చూడఁగఁ దలోదరి పాదలిమూఁకలోపలం
జెడితివి కాపురానికి హానీయని నెచ్చటఁ దెచ్చినావురా!

పడినపాటులు పడని దేవతలుగాని
తారకాసుర సాగరోత్తరణకరణ
నావ నీ పౌదు వంచు నున్నారు నీవు
చెలఁగి యిందుపగంజఁ దెచ్చితివి పోయి

పుడిసిలించినవాఁడు విడిసి పట్టు మని సా
గరవారి పెఱతరంగముల గములు
దుసికిలించినవాఁడు తూఁగి తూఁగించి మం
దాకినిఁ జలిపర్వతంబు గూడు

ముదలకించినవాఁడు పొదరు కన్బొమల నీ
లిమచేఁ బ్రిభాతనాళీకజన్ము
నురవడించినవాఁడు బిరుసుగడ్డైన మం
చుంగొండలో బీట్లు చూపునట్లు

ఎవ్వఁడో యొక్క తేజోమహిమయు కూఁతుఁ
దెచ్చియుండిన దైత్యు సాధింపవచ్చు
వేల్పు లనుకొన్నయట్టిది వేఱు నీవు
చేసినట్టిది వేరోయి చిట్టితండ్రి

అతితరభీతి నందితిసుమా నెల తక్కువబిడ్డ వంచుఁ బా
పతిమిరలు ప్రేమై బ్రతికి బట్టనుగట్టితి వంచు సంతసిం
చితి నొక గొప్పయింటిదగు చేడియఁ గన్గొని పెండ్లిచేయ నెం
చితి నిటు తల్లికిం దెలియఁజేయకపోయితి తెచ్చి తీయమన్

నాయనా? నీవు నెన్ని గండాలు గడచి
బయటఁబడినావో తలఁపునఁ బారె నేని
శాంతమై యుండి నా మోడల్ జలదరించు
నీశ్వరకటాక్ష మున్నది యింతవరకు

ఇది నా భాగ్యము చూచెదన్ జిఱుతతండ్రీ! ఆమోడల్ తా నెఱుం
గదు నీ పుట్టినవేళ నీ జనని పైగాఁ గొంప నిప్పంటుకొ
న్నది తండ్రీ! యది చాల దన్నటుల పైనన్ బొంగి భాగీరథీ
నది యిల్లంతయు నీటిలో మునిఁగి నానాబాధలై యుండఁగన్

ఆ వరదలోన నెచ్చట
నీవో నా తండ్రి యెచట నేనో తెలియం
గా వీలులేద చివరకు
నీ వగుపించితివి కొన్ని నెలలకు నాకున్

వరదలోఁ గొట్టుకొనిపోయి వరద తీయు
నొడ్డునను తెల్లుతోఁటలో నొండులోనఁ
జిక్కి కడు పుబ్బునేడ్చెడు చిట్టితండ్రి
నిన్నుఁ గని జాలి యేరికి నెగడకుండు.

పతులకు భీతులై పొసుగుపల్లియ బ్రాహ్మణకాంత లల్లదొం
గతనముగాఁగఁ జన్గుసుపఁగాఁ దెలిచిక్కని తెల్లుపూల సం
గతిఁ జిఱుమెత్తపొత్తుఁబఁ బగళ్ళను రేలును సాగిపోవఁగా
బ్రతికితి వీవు నాదయిన భాగ్యము మంచిది రయ్య యింతకున్

ఆఱుగురు చంద్రు లుదయించినట్టులైన
నీ మొగము చూచి చల్లనై నెగడెఁ గనులు
పసుపుఁదోఁటలో నంకురంబులవిధాన
తనువు నా మేను పులకరించినది తండ్రి!

అనుచును గోడలిం గని హిమాచలకన్యక మల్లెపూల కొం
దనుకుల మేలిపల్వరుసదాన! సరాసరి తూరుపోత కొ
గ్గిన తెలిమొక్కజొన్న చిఱుగింజలవోలికఁ జూచె దేల ర
మ్మని తన చేయువందిగిచి యా సుదతీచిబుకంబు నెత్తుచున్

నను సిగ్గు బెళుకుకన్నుల
నినిచెదు నావంకఁ గనుము నీలాంబుజలో
చన యీ నా బంగరు తం
డ్రిని జెట్టంబట్టి ఇది యదృష్టము తల్లీ.!

పేదసంసార మైనను పిల్ల! మాది
పరువు మర్యాదలకును లోపంబు లేదు
ఇచట నాయన లేకుండ నే పనియును
మసల దంతటివారు మీ మామగారు

సెనగబద్దంత లేనెలజిగి నొసంట
సిగ్గునవ్వులు చెక్కిళ్ళఁ జెరువు రేక
మనసుతో సదానించి చూచినను గాని
నీదు నందమ్ము తెలియదే సభ్మ్రతహాసన!

నునుపులు తీరు వెల్గులఁ గనుల్ చెదరించును నిల్వనీయ దా
ర్చిన నడమంతరంపుసిరి చిక్కనగుండియ చిక్కఁబట్ట నూ
కొను పడుచోటనే వెదకికోవలె సీలువురాల! నాదు బి
డను సుఖపెట్టు మమ్మ యకటా వికటంబుల సంచరింపకన్

చెడ్డసురాలికోసమయి జీతము బత్తెము లేని కొల్వు నా
బిడ్డది కాలిబంట్లయిన వేల్పులపై దుముదారుగాని యే
ర్పడ్డ సురారిమూకలను బారఁగఁదోలెడు వేళఁ గాక నా
బిడ్డ మనస్సులోపలను వేమఱు త్రవ్వుకొనున్ మనస్వినై.

తెలియునో నీకుఁ దెలియదో జలరుహాక్షి
నా కొడుకు గొప్పకవిసుమీ నా యనుంగ!
ఊఱక నెప్పుడు నూహించుచుండు నెదియొ
కూర్మి నీపయి లే దనుకోకు మమ్మ

ప్రకృతి విచిత్రమైనయది బాలిక! పేదతనంబు మాకు న
చ్చిక యయినట్టిదా దినుసు చేడియ మా కులమింటికోడలై
యొకతుక వచ్చెనేసి యదియున్ సిరితీపుల కంగలార్చుపో
లికయును మాకుఁ దగ్గటుల లేనిది యాటకు సంతసింతుమే

వినయము నేర్పునొజ్జసుమి పేదతనం బది గుండెలోన నే
జనుడు జగంబుబాధలకు జాలయి నీరయి పోవు వానియా
త్మను రససిద్ధి మార్గమునఁ దార్చెడు నిచ్చిన దానిచేతఁ దూ
లిన జను లెవ్వరున్ గసఁ జలింపరు వేరసమార్గమందునన్

పొండమ్మ సుఖంపడు మని
పండిన ముత్తైదు వత్త పంపిన సిగ్గుల్
పండిన చేనగు కోడలు
నొండు విఱుఁగు నదివిధాన నొఁగిఁ జేరి చనెన్

అమ్మ యేమన్న దన్నట్టు లాత్మభర్త
సెజ్జపైఁ బండుకొని దేవసేనఁ గాంచె
ఆమె సిగ్గులచిఱునవ్వులందుఁ దోఁచెఁ
బుట్టివి ల్వ్రీడ నగు శ్రీని పోయినట్లు

చిఱురేల చివురాకుచివరి జగాజిగుల్
గిలకొట్టు లేఁతచెక్కిళ్ళమీఁద
తమిరసాలకిసాలయము చిట్టచివరలు
దమియించు లోచనాంతములమీఁద
హరినీలశకల భాసురరమాసుషమా స
ఖంబులౌ వక్రాలకములమీఁద
సొబగారు పుట్టుమచ్చబెడంగు జిగిపొంగు
కమ్మని నునుచిబుకంబుమీఁద

సొగసువేఁ బోకజిగుల బుజాలమీఁద
ఓలి నులిసెడు నవకంకణాలమీఁద
నిఱుదెసల మేనిపుల్కల నెసఁగుచుండ
కమ్మసిగ్గులు ముద్దులు కలిసిపోయె

గోరువెచ్చన సుధాపూరకపోలమ్ము
పతి తీసికొను ఱొమ్ముపైన నాన్చు
మృదుకంపన స్వేదపదకరంబుల స్వామి
చిబుకంబు చిఱుతదోసింట నూను
చిఱుభీతియవు వెన్క తెరకాంతి విరఁజిమ్మ
వలపుచే భర్త కన్నులను గాంచు
పతిమనస్సునఁ గష్టపడినట్లు గ్రహియించి
బతిమాలుగతి తలవంచి నవ్వు

జలరుహాయతాక్షి తొలిసంగమము వేళ
చిన్నిస్వామి సుఖము చేడికొనియె
వలపు సిగ్గు భయము కలిసి ముప్పేటగా
పేనినట్టి కోర్కె పేర్మిఁ జేసి

సిగ్గును భయమును జంటగ
మొగ్గిన యవి భయము విచ్చిపోయిన నైనన్
సిగ్గును చెదరక యున్నది
సిగ్గునకే సిగ్గు కలదు సీమంతినులన్

సొలయునుగాని తాఁ గనిన సౌఖ్య ప్రకాశముకాక యుండ సి
గ్గు లొలుకు నాననంబు పెడకున్ మలయించుక భర్త బొమ్మపైఁ
దల యిడుఁ బెన్మిటిన్ నయనతామరసంబులఁ జూడఁబోవ దా
వలఁ జిబుకంబు నొత్తు పతిపాణినవాంగుళిఁ బంట నొక్కుచున్

తనమొడ లేమొ తీవ యని తాఁ బతి యాడిన వాని మొక్క చుం
బనబరమార్థమైన తనమై సుమవల్లరి యంచు స్వామి చె
ప్పినఁ దన మే న్సుధాసరసిపీచిక యంచును భర్త యాడుచుం
డిన ననుభూతికిం దెలిసె వికటము లంచును భర్తృవాక్యముల్

చెలువుగ భర్తపాదములచేతఁ గరంబులచేత మేనిచే
సలలితచుంబనార్ద్ర ముఖసారసపంక్తులచేత వాని యు
జ్జ్వలపరిణాహ మంజుతరవక్షముచేతను జొచ్చుకొన్న య
వ్వెలదుక మేను కప్పఁబడి వే అగురూపమె లేనియట్టులై

తన మొగము రెండుచేతులఁ దాల్చి భర్త
వాల్చనీయక బిగువుగాఁ బట్టినంత
గజబిజి విలోచనంబుల కాంతు లొప్ప
తెచ్చికొని నవ్వె బిగువుగా దేవసేన

తనపదముల్ పతిం దగులఁగాఁ దొలఁగింప లతాంగి స్వామి వెం
టనె నలినాక్షి పాదనలినంబులు చేతుల నూని గట్టిగాఁ
దన తొడలందుఁ జేర్చికొని తాఁ దొలఁగింపఁగ నీయకున్న బీ
తున నది యొక్క ప్రేమగుటతో యని మిన్నకయుండెనామెయున్

పెంపుడుతండ్రికూడఁ గనిపించని యిచ్చట నత్తవారి పా
లింపులలో మెలంగనువలెన్ బతి కూరిమి నిల్చునట్లు సె
ల్లింపవలెన్ మనోహరుని లీల లటంచు నె కాక యొక్క సౌ
ఖ్యంపుఁ బ్రవాహవీచికలయందున నామెకుఁ దోఁచ దేమియున్

పతికి నిద్దురవచ్చెడుపగిది లేదు
నెలఁత తనకన్నముందర నిదురపోవ
వాతఁ డే మనుకొనునో యటంచు నెంచు
నెలఁత సొలసినకనులపై నిదురవచ్చె

స్వామిసుఖంబునుం జెఱుపఁజాలక వాహనమైన కుక్కుట
స్వామియు యామినీపరవశంబుగఁ గూయక యూరకుండినన్
శ్రీమతి దేవసేన యెదఁజెందినదా నలవాటుచేత ని
ద్రామలినత్వమున్ వదలె దాపయి వచ్చిన వేఁగుఁబోకకున్

స్నానముం చేసి శుభ్రవస్త్రంబు తాల్చి
ముంగిటఁ జిత్రచిత్రముల్ రంగవల్లి
కలను దీర్చెడి కోడలిఁ గాంచి యత్త
యింతిచేఁ బరిచర్య చేయుంచుకొనియె

ఇది సేనాగ్రహాణ మను
ద్వితీయాననము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా వి జయ ము

అచ్చపు జంటితేనెపెఱ యంబుజకాంతదృశాంత క్రొత్తగా
వచ్చినకోడ లార్ద్రితరభావనిధానము శాంతభావ సం
పచ్చతురాస్యసుందరి కృపారస సాధుసుధాంబువాపి యం
చెచ్చట దేవసేన నుతులే విన్నిపించెను వారి కచ్చటన్

ఒకనాడు సప్తమాతృక
లు కోడలింజూడ మనసులోఁగొనిరా బో
రుకలుగఁ గైలాసాచల
నికటగ్రామముల సాధునిస్వానములై

తల్లీ! యెప్పుడు దేవసేన తనసద్మంబందుఁ గన్పించ దే
పల్లీలౌకికజీవనంబు సవరింపంబోవునో యే మహా
పల్లీనంబగు పేదకాపురము సంభాళింపఁగాఁ బోవునో
యుల్లంచున్నద టన్నపే కతివ యెట్లుండున్ గృపాసారయై

తల్లులు తెల్ల బోయి ముఖతామరసంబులఁ గాంతిమాలఁగా
కల్లరి సౌఖ్యమా సుతుని కాపుర మేమయిపోవు నంచు లోఁ
దల్లడ మందుచుండియును దా నది పైకిని దోఁచరాని హా
సోల్ల సనంబునన్ నిజతనూభవుఁ జూతు మటంచుఁ బోవుచున్

ప్రాణిధర్మంబైనఁ బాటింప దీ జాతి
యని ముక్కుపై వ్రేళ్ల నదుమువారు
ఈ దానవులబాధ యీదేశమున కెప్డు
పోవునో యని వగపొందువారు
అన్నన్న! పురుగులకన్నఁ గనాకష్ట
మైతిమే యని దుఃఖమందువారు
ఆలించువారును బాలించువారును
లేరాయె నని మూదలించువారు

నై జనంబులు గుమిగూడి యంగలార్చు
చున్న యొకచోట మాతృకల్ చన్నచోట
కారణంబుఁ విచారింపగాఁ జనంబు
లిట్లు చెప్పిరి కన్నుల నెజ్జసెఱల

తారకాసురపతి యధికారి యొకండు
తులువ పాలించు నీ ప్రాంతముల పతండు
వాని యధికారగర్వంబు వాని మదము
వానికే యవి తెలియుంగవలయు నమ్మ

హయములు పూన్చనట్టిదియు నావిరిచే నడపించునట్టిదిన్
రయ మది యింత యంచు ననరానిది యంత్రపు బండి తెచ్చి వి
స్మయ మొదవించుకోసమయి మా చిఱుపల్లియ వీథిఁ దోలె ని
ర్భయముగఁ దానిక్రిందఁబడి ప్రాణము వాసిరి కొంద ఱిచ్చటన్

అందులోఁ గొనయూపిరి యాడుచుండె
నిద్దఱికి దేవసేన తా నేగుదెంచుఁ
గాచి రక్షించు నని నమ్మకంబు వారి
కిట్టు లున్నది వేల్పుల యీ ధరిత్రి

అనినన్ మాతృకలున్ కృపాగుణముచే నాందోళనం జెంది వా
రిని గాన్పించు డటన్నఁ దోకొనుచు వారిం జేర్చ వారూచి మ
న్పినదే యంచును దేవసేన జననీ శిక్షింప యీ బాధ మా
న్పినదే మందని సేనకా దని పరిక్షీణాసుతం బొందఁగన్

కడచిన ప్రాణముల్ నిలుపఁగల్గు మహత్త్వముకూడ నున్న దా
పడతుక కంచు వారడుగఁ బల్లియవారలు దేవసేన మా
చెడి పరిశీర్ణమై చనిన జీవనముల్ మఱి నిల్పఁబెట్టె మా
పడిన పరిశ్రమంబు ఫలవంతముచేసెడు తల్లియం చొగిన్

ఆమె యెచ్చట నున్నదో యామె యిచటి
వృత్త మెఱుఁగవలె నన మాతృకలు మేము
నామె చూచుటకే పోదు మామె మేము
యామెతో నిద్దచెప్పుదు మంచు వెడలి

సేనతో నెన్నియో చెప్పఁగావలయున
య్యూమెకోసము చూతు మనెడువారు
నాలుగైనట్టిది నాలుగా నెను రెక
రిరయుదు మామెకై యనెడువారు
ఇన్నాళ్లు రాకుండ నెప్పుడు లేదు మ
మ్మరయ కిఁచును నఁగలార్చువారు
ఏ జగద్రక్షణాహీనకార్యభరంబు
నం దెంటు మసలునో యనెడువారు

నైన పలుగాత్రిమమ్ములయందు నరిగి యరిగి
తుదకు నొకచోట నా చోట దొరకు ననెడి
మాట చెవివేసికొని యంత మాతృకలు ప్ర
యాణమైరి కుబేరదేశాంతరంబు

వలఁకుల నేత్రపర్వముగఁ బన్నవికోసగు పచ్చిముత్తియం
బులు విలువాకు కుప్పలుగఁ బోసినయట్టుల నున్న చిక్కు-కం
కెల బరువై తలల్ మలచు క్షేత్రములంబయి మింటఁ బైడి యెం
డలతఁగల్ విశాలనయనంబులమణ్ సరిహద్దులై చనణ్

పశువులకు బీడులేకుండఁ బంటచేలు
మనుజులకు వీలులేకుండ మందిరములు
మందిరము లంటు నాకాశమండలంబు
చేలు వ్యాపించెడును దిశాసీమలకును

కనుటకుఁ జేలు మేడలును గాని నిజంబుగ బుద్ధిలోపలన్
ధనము ధనమ్ముగా నయిన తత్స్వరసీమల నేగి నేగి యె
వ్వనిఁ గని సేసనుంగుఱిచి వార్తయెఱుంగఁగ వేడినన్ గనుం
గొనరును మాటచెప్ప రిదిగో యని సెవ్వరు నాలకించరున్

జనములు గుంపుకూడి యొకచాయను బాయక శ్రద్ధధానులై
యునికియు నెవ్వరేని యెదియో విషయంబు బ్రమాణమైన దా
నిని వచియింపుచున్నకరణిన్ గని మాత్రికలున్ జలచ్చలత్
జనిత కుతూహలాత్ములయి సాగిరి యా జన మున్నచోటికిన్

పదిసెంట్ల గోదుమపైరు కుప్పనువేసి
నట్లున్న కుదిమట్టమైన బొమ్మ
చేతీత చేనేఁతచీర పచ్చనియంచు
మెఱపునా బొమ్మపై మెలఁగుమూర్తి
పైడికాంతులతోడి ఫాలభాగమునందు
నెఱ్ఱకుంకుమపుబొట్టెసఁగు వెలుగు
నిలుచున్నతీరులో నిఖలదానవ గర్వ
మపహరించెడు ప్రతిభాభిరామ

గున్నమామిడి పూచె నోకో యనంగ
నవవసంత మనోహరానందరేఖ
యింతి యొక్కతె మాటాడ నెల్లజనులు
మంత్రముగ్ధులవలె నిలంబడిరి చుట్టు

ఒకసంగీతము పాడుచున్నటుల ధారోక్తిప్రసారంబుగాన్
ఒక యాజ్ఞాపరిపాలనంబువలె నేత్రోదారకాంతిచ్ఛటన్
శుకముల్ పల్కుచు నుండగాఁ బరభృతానుస్వాన గానంబు పొం
దికగా స్పష్టములైన పల్కులబడిన్ దీపుల్ పిసాళింపఁగన్

సహజముగ నందకత్తియ జలరుహాక్షి
ఆమె చేయు నుజ్జ్వలనుపన్యాసవేళఁ
గన్నుబొమ్మల చెక్కిళ్ళ కదలికయును
గనుల వెలుగును నందంబు నినుమడించు

ఒక జలవృక్షమందుఁ గుసుమోద్గమమై ధర విచ్చె గుచ్ఛమై
సకల ధరాప్రసూనమధుసారములందున మానవాళి తేం
ట్లకరణి స్నానభోజనకలాపము చేయ సమానభాగమై
మొకరులు కొన్ని యేటికి గుముల్ గొని కొన్నిటి పాఁద్రోలెడిన్

వేల్పునేల యిద్ది వేల్పుల యిష్టమై
నట్లు పూర్వరాజు లట్లు చనిన
దున్ని నాటి కోసికొన్నట్టి వారిదే
అంతమాత్రమయినయట్టి చెక్కు

ఎవ్వఁడు దున్నెవాని దగు నీ ధరణిం దనుజేశ్వరుండు తా
నెవ్వఁడు దున్ను వాని దని యిచ్చెను విక్రియయోగ్యమై చనన్
గ్రివ్విన యాస్తులై సురలు కొందఱు దానవులైరి వారలుం
జివ్వకుఁ జొత్తురీ పెఱలజీవితముల్ కృతసేవమై చనన్

ఆ మహాదేవి మా యూరి యాడపడుచు
ఆ మహాత్ముఁడు మా యూరి యల్లుఁ డన్న
పలుకులందలి యర్థమ్ము పాడువడియె
నూరిలోఁ జెక్క యొవరిదివారి కగుట

ఒక సమష్టికుటుంబమై యున్న యూరు
వ్యష్టిబ్రదుకులుగా నయి వారు వీరలు
వీరు పాలేరు లైరి కల్పించినట్టి
భేదములు వేసఁగిపొలాన బీట్లుగాఁగ

ధన మనఁగ నెట్టు లుండునొ
జన మెఱుఁగరు మున్ను బ్రదుకు సారమౌకలిమిక
ధనమే జీవితలక్ష్యం
బనఁగా రసహీన మయ్యె నందఱిబ్రదుకుల్

మనచదువు మాన్పించెను
తనచదువుం జెప్పె నసురధారుణి ప్రజ కెం
దును క్రొత్తయొక్క వింతయు
కనఁ బ్రాతయు నొక్కరోతగా నన్పించెన్

పరిచితి కల్గినట్టి వగు భావములం దభిమాన మొప్పు నీ
పరమరహస్యముం దెలిసి పాలసుఁడా యసురేశ్వరుండు నా
విరియగు స్వీయవిద్య చదివించెను దేశము వావిజ్ఞానమే
పరమయథార్థ మంచు పలుపాట్లను పాలగుచున్న దక్కటా

ఆ దితి గర్భసంభవులయందున నుత్తమధీకులైన ప్ర
హ్లాదుడు నాదిగాఁ బరమార్థవిదు ల్గల రైనగాని త
ద్వాదము లీ ధరిత్రిగలవారికి నాత్మ నెఱింగినట్లుగా
మోదముగూర్చ వెంబడిన మోహము క్రిమ్మ ని దెంత చిత్రమో.

వాని నెదిరించిరా యేని వాఁ డొసంగి
నట్టి యాస్తులు నిలచెడునట్టిలేప
భయముతోఁ బాటు నధికారపటిమ సౌఖ్య
ములును వదలఁగఁ జాలని మోహ మొకటి

ఇట్టి యిరకటమునఁ బెట్టి యెల్ల వారి
ప్రాణ మానంబులను భుక్తపరచుకొనియె
తేనెపూసిన కత్తియై దితిసుతుండు
నమరతతిఁ గొంత లేలిహానములఁ జేసె

పండక వానలేక యిట భారతధాత్రిని మున్ను క్షామమై
యుండనువచ్చుఁ బండియు నహా యిట క్షామముగా నొనర్చె ను
ద్దండుడు దైత్యరాజు తనదండు విమోహితచిత్తవృత్తులై
యుండఁగ పట్టిపై మెఱుపు లూది జయించినయట్లు చూపెడున్

నీదు వేళ్లు పెట్టి నీ కన్ను పొడిపించు
తనది తప్పు లేద యనిన యట్లు
మనదె వేళ్లు కన్ను మనదియే యను తెల్వి
మనకు లేవి మోహమును ఘటించి

శ్రమలేక జన్మతో సంపన్నులై పుట్టి
అధికారముల నెల్ల నాచికొనుచు
తల్లిదండ్రులు నన్నదమ్ము లీ మొదలైన
ప్రేమబంధమ్ములు త్రెంచికొనుచు
కామాదులకును స్వేచ్ఛామార్గ మయినట్టి
యసురనాగరకత నలముకొనుచు
పేదవారిని మోసాపెట్టగా సర్వ స
మానసిద్ధాంతంబు మప్పికొనుచు

లోక మెల్ల లోఁగొను విద్యలోనఁ దమరు
నందెవేసిన చేతులై రక్క టకట
దేవతలుగూడ దితిజుల త్రోవఁబట్టి
యసుర పన్నిన వ్యూహంబునందుఁ జిక్కి

వందమంది పేదవారి నెత్తురు గడ్డ
గట్టి నీవు మేడ కట్టినావు
వారియుసురు తీవ్రవాయువు వీవఁగా
తూలి మేడ నేలఁ గూలిపోవు

వెసభూమిప్రజదా స్వతంత్రమతియే విష్ణుస్వరూపంబుగా
నసురన్ గుత్తుక కత్తిరించు నవచక్రాంశుప్రతానంబుకై
విసరత్స్వర్వసమానభావకలితోర్వీణ వైనతేయుండు ప
క్షసమున్మీలిత తీవ్రమారుతతరంగప్రోజ్జ్వలుండై దిగుణ

అందఱకు వృత్తి చూపించునట్టి నేర్పు
నీదు రాజ్యాన వెలసిన నీతిలేదు
దేహళికి బిచ్చగాఁ డగుదెంచె నేని
లేచి పొమ్మని పారఁద్రోలెదరు గాని

వృత్తులు సర్వనాశ మొనరించిన దైత్యుఁడు ప్రాణులెల్ల నే
పొత్తులఁ గుక్షి నింపుకొను పోఁడిమి చూపను లేక సంఘమున్
గ్రొత్తగఁ దీర్తు నంచు నదిగో యిదిగో యని క్రేళ్ళు సూపు చుఁ
ద్వృత్తి మెలంగఁగా నసుర వేముపట్టినవారు మెచ్చుచున్

యంత్రములచేత సర్వకార్యములు చాల
శీఘ్రముగ సల్పబడు నని శిష్టకాల
మఖిల జనములతోఁ బాటు యంత్రములకు
కూడ విశ్రాంతి యది సమకూడు నందు

తక్కిన కాల మేమి యగు ధ్యానము చేయుచుఁ గూరుచుందురో
అక్కట దైవమున్న దని యాత్మయు నున్న దటంచు నమ్మువాఁ
డొక్కఁడు లేడు సంఘమె మహోజ్జ్వలమౌ పరమార్థమైన యీ
దిక్కున శిష్టకాలమునఁ దెత్తురు జ్ఞానము సంఘవృద్ధికై

ఈ రాక్షససంఘంబున
నారా తా నొక్కజీవి దగు భావిశుభ
ప్రారంభ చింతలే దది
వారు బ్రదుకుచున్న బ్రదుకె పరమార్థమునాన్

సువ్యవస్థిత సంఘంబు వొచ్చి చెఱిపి
యే భవిష్యత్తుననొ స్వర్గసృష్టి చేయు
వారలై వర్తమానంబు ప్రళయకాల
ఝంఝగా మార్చుచున్నా రసాధుజనులు

బ్రదికియున్న వారి బ్రదు కెట్లు లన్నట్టి
ప్రశ్న లేదు సుంత భావిప్రజల
జీవితమ్ము గూర్చి చింతతో నడతురు
చిత్ర మైనయట్టి జీవవితతి

అధికారము చేయుటయే
ప్రధానలక్ష్యంబు మఱుగుపరతురు దానిఁ
వ్యధ భావిప్రజలకోసము
క్రుధాగుణము హృదయవీధి కాలంకషమై

సువ్యవస్థిత సంఘంబు సుఖముకొఱకు
సుఖము దేనికి ననుభవించుటకు నెవ్వఁ
డిచట యనుభోక్త జీవుఁడో యెవఁడు వాఁడు
నాతనిస్వరూప మెట్టిదె ట్లనుభవించు

అనుభవించిన నతఁడు స్వాయంభువ యగు
అనుభవించెడునట్టి నైచ్యం బదేల
యిట్టిమీమాంస చేయక యెవఁడుగాని
కాంచునే నిత్యమగు సాంఘికవ్యవస్థ

కొనకొని సర్వదా సుఖము కోరుట జీవుని లక్షణంబుగా
ధనము గలట్టివాఁడు మఱి తా ధనహీనుఁడుకూడ జీవులై
యనుజులు నగ్రజాతులునునై యొక రొక్కరొక ర్మొకళ్ళకి
దనుజుని పంపకంబునకు దవ్వాయిపోయె సుఖానుభూతికిన్

ఆరుమొగముల వేల్పు తా నసురరాజు
రేపు సమయుద్ధమందు దొరించఁగలఁడు
మరల సురరాజు తొల్లింటిమాదిరిగనె
పరువు లెత్తించును బొలాలపై మొయిళ్ళ

ఈలోపున మీరందఱు
మేలుకొనుడు పంచి యిండు మీ మీ పాలముల్
కాలోపహతులు పేదల
కా లోపము పూర్తిచేయుఁ డమరేశునకున్

అంత నూరక యుండిన యామె నిభృత
శాంతసుకుమార వదనాంబుజాతమందు
నుపరమించిన శారదయున్ రమించు
చున్నయది సర్వమంగళయున్ జెలంగ

మిద్దెలు మేడలున్ బొలము మే మని మే మని గుంపుగూడి తా
మిద్ది యిదంచుఁ దీసికొను డీయని యిచ్చిరి తత్సమాగతుల్
గద్దియఁ గూర్చుచుండి యసుఖంబుగ నాయమయున్ శివార్పణం
బిద్ది యిదంచు వాళ్ళలననే గ్రహియించెను సర్వసంపదల్

అదియుఁ గోడలిఁ గాంచెడి నదను కా ద
టంచు మాత్సృక లేగి నారంత నంత
ముసరుకొని వచ్చుచుఁ జుట్టి మోహాజలధి
పెద్ద కెరటాల నొడ్డున విఱుచుకొనియె

తీవ్రభావంబు త్యజియించి దేహమునకుఁ
దాఁకినంతన సుఖమయి తమ్మిపూవు
చుట్టము వెలుంగులుంగరా ల్చుట్టికొనుచు
పండిన ఫాలాలమీఁదను బారులాడె

ఇది శత్రుపరాజయ మను
తృ తీ యా న న ము

ఓం.

# శ్రీ వల్లీ దేవ సేనా విజయము

ఆ రీతిఁ బలుచోట్ల కేగి సుకుమారాలాపహేతుప్రతా
నారూఢోక్తుల శాంతవాక్కుల ధనాఢ్యశ్రేణి క్షేత్రంబులన్
ధారాపేతముగాఁగఁ జేతఁగొనుచున్ దానంబుఁగా శాంత ధీ
శూరత్వాకృతి పేదవారలకు నిచ్చున్ బిల్చి నల్దిక్కులన్

మాసిపోయిన ప్రాఁతమగ్గాల నెలకొల్పి
పరమేశ్వరుని దిగంబరత మాన్పు
మూలఁబెట్టిన రాట్నముల బైట తీయించి
విదియచందురునకు విందుచేయు
పునరుద్ధరించి చెప్పులను గుట్టెడు వృత్తి
మాతంగకన్యకు మన్నన యిడు
బీళ్ళు కాలువగట్ల వేలముల్ మాన్పించి
నందీశ్వరునకు [illegible]ట మిచ్చు

కుంభకారవృత్త్యాదులు కూర్చి సురల
విఘ్ననాయకునకు మరి వీరభద్ర
దేవునకు సమకూర్చును తృప్తి సేన
మెట్టినింటికి వెలుఁగయి మెలఁగుచుండి

మా త్రిలి దైత్యనిర్మిత సమాజమునందు ధనాధికారముల్
గుత్తకుఁగొన్న పాలసులు కొందఱు మోహముగొన్న కొందఱు
హ్వాత్తుగ దేవసేన జగమెల్ల నవాగరకంబు సేయఁగా
నెత్తిన యెత్తటంచు వచియించి పరిచారము బెట్టు చేయుచున్

అగ్నిశిఖాభమౌ నామెశీలమునకు
గృహమంట దను ధూమరేఖ చెప్పి
అంబుజాప్త వెలుంగు లామెమాటలకుఁ గా
తిన్య మన్నట్టి వేడిమిని జెప్పి
వైదికం బయిన తద్వాదంబునకు ప్రీత
యవి మాట లన్న లౌక్యంబు చెప్పి
యచ్చవెన్నెలవోని యా ప్రసన్నాత్మకు
తర్కజాటిల్య శైత్యంబు చెప్పి

అమృతమయమైన నిత్యరసాత్మకును ద
దీయ పూర్వజనుస్సంస్కృతికిని సుంత
యైన సంబంధ మొలయనియట్టివారు
మా [illegible] సేనతోఁ గచ్చకట్టి

ఈ దేవాసురభావయుద్ధ మిదియుఁ సృష్ట్యాది సృష్ట్యంత మం
చాదిఁ లోన నెలుంగు సేన యొకనాఁ డా దిక్కునఁ మొగ్గు సే
డీ దిక్కుంబడి మొగ్గుచూపు నని నా రే మన్ననుంగాని కా
నీ దైవం బెటు లున్నదో యనుచుఁ దా నెంతుం గ్రియాదక్షుఁడై

దైత్యభావంబును యథార్థతరకు మొక్క
దాని కొక్కటి దగవు వితండ జల్ప
ములకు దగ్గరిబంధువు మోహబుద్ధి
సేన వారియందునఁ ద్యజించినది తగవు

కొందఱు దైత్యభావమునకుఁ మును దాసులు దేవసేన వా
క్యేందుమనోజ్ఞచంద్రికల హృన్నవకైరవముల్ ప్రసన్న భా
వేందిరఁ బొంది దైత్యుఁ డొడవించిన సర్వము దుష్టమం చొగిఁ
నిందపొనర్చుచుం బరిగణింపక యుండఁగ దాని లేశముఁ

తిరుగుచుండఁగ నొకనాడు దేవసేన
వారిలోఁ గొందఱఁబిల్చి వత్సలత్వ
మెనయఁగా బుజ్జగించుచు నిట్టు లనియె
మందహాసంబు సెలవున నందగింప

పృథివిని సర్వమిష్టమయి యేదియు లేద తలంచి చూడఁగా
నధికము మంచి దైనయెడ నయ్యది మంచిది యందు మందులో
నధికము చెడ్డ దైనయెడ నయ్యది చెడ్డది యందు మందుచే
శిథిలముగాఁగ సర్వమును జేయఁగరా దది యొప్పుదైన [illegible]

హరి తన చక్రధార నఖిలాసురులన్ మడియించలేడె తా
నరనివాసంబులోన నెప్పుడైనను తానటు లాచరించెనే
యరయఁగ వేల్పులైనను నహంకృతిచే మితిమీరిపోయినన్
ధరణికిఁ జేటుగాదె యది దానవభావము వేఱ యున్నదే

సేనలు తెచ్చి శీఘ్రముగఁ జేర్పఁగ నావిరిఁగో మహాత్వరా
యానము చేసి యందఱు ప్రయాణముచేయఁగ వీలు చూపి సొం
తానికి డబ్బుచేసికొను దానవుఁ డయ్యది బండి దోసమా
దేనినిగాని   డుకొనుతీరున నున్నవి మంచి చెడ్డలున్

కాశికిని బోవనగు వర్తకంబు సేయ
వచ్చు బంధువులను జూడవచ్చుఁ బోయి
శీఘ్రముగ వేయిపనులను చేయవచ్చు
ధూమశకటంబు గాదనిత్రోయ నగునె

ఒక యిది యేమిటి దానవుఁ
డొకవంద జగత్ప్రయోజనోపాయంబుల్
ప్రకటితమహిమము లాశ్చ
ర్యకరంబులు చేసి వాసినా? కా దనుటల్

ఓయీ! భారతదేశ పూర్వఋషు లెట్లో దివ్య మహాత్మవి
ద్యాయోగంబున సంఘజీవన ప్రశాంతాధ్వంబులన్ లోకవి
ద్యాయోగంబునయందునన్ బ్రకృతిశాస్త్రప్రౌఢమార్గాన దై
తేయప్రాజిత లబ్ధ సూక్ష్మధిషణా దీప్తిప్రియాపండితుల్

మయుఁడు శంబరుండు మరి రావణుం డెంత
యెంత పండితులు నహీనమతులు
నంతకంటెఁ గూడ వాధునికులు మహా
మహీము లనుట రిత్తమాట కాదు

కడు ననంతయుగంబులుగాఁ జెలంగు
ధాత్రి యిది నిన్న మొన్నటిదానిగాఁగఁ
జెప్పి ప్రతిదియుఁ గ్రొత్తగా సృష్టిచేయఁ
దమకు మించినదానికెత్తెదరు వారు

కొన్ని తపస్సుచేతఁ గనుగోనగునట్టివి జీవధర్మముల్
కొన్నిటిఁ దెల్విచేఁ దెలిసికోనగునట్టివి శీలధర్మముల్
కొన్నిటి జేసిచూచి కనుగోనగునట్టివి లోకమందుఁ దా
మన్నిఁటి నొక్క సృష్టిఁ గను టాసురమానసవృత్తి యయ్యెడున్

ప న్నెవఁ డిచ్చుఁ గాఁడె యగుఁ బౌరుఁడు దానవరాజ్యమందు నా
సన్నములైన స్వసుఖసాధనసంతతిలాభ మెల్ల సం
పన్నులకే యవం డసురవర్గము చేరును వానిదే సము
స్తోన్నతి పేదవాఁ డొకరుఁ డుట్టినగట్టుక యూగులాడెడున్

బిచ్చ మెత్తుట తప్ప జీవించుత్రోవ
చూపఁగాలేదు రాజన్న శూరపాళి
వాని వ్యూహమ్ములో నెంతవరకు నీవు
చొత్తువో యంతగా నీవు శూరుఁ డగుదు

వాఁడు సంఘమ్మునందు దైవంబునందు
జీవ విషయంబునందునఁ జేసినట్టి
మార్పు లిహలౌకికార్థసంపాదకములు
పారలౌకికసంప్రాప్తి బహిరవెట్లు

గృహ్యముల్ శ్రౌతముల్ విధుల్ కేవలముగ
ధర్మ మాచార మిచట సంధానపఱచు
మట్టి కాదాయె దేశంబు మనుజు లన్న
మట్టి యవుదురయేమి ధర్మంబువదలి

అందఱును జీవులే భేద మనుచు లేద
యేని భేదంబు తనువులయందుఁ గలదు
ఇష్టములయందునను మనోవృత్తులందు
కలదు చివరకు మాటలోపలను గూడ

పుట్టుకఁ బెంపకంబునను బొందు గుణంబులు మానవాళిలోఁ
బుట్టుకలోనిదే గుణము పొందెడు నేడు తరాల మారుపా
యిట్టుల మార్పుచేసి వెలయించిన లోకము నేకబుద్ధిగాఁ
బట్టెద మన్న సాధ్య మను పల్కటు లుంచిన సర్వముక్తి కా

అవియె కావు తినెడు నాహారమునఁగూడ
గుణము సంక్రమించు జనులయందు
నఖిలధాత్రి దొరకు నాహారములయందు
నొక్కగుణమె తెచ్చి యుంతు రెట్లు

నమ్మిక మేము పెంపకమునన్ దన పుట్టుకచేతఁ బూర్వ జ
న్మమ్ములఁ జేయు కర్మవలనన్ మఱి కాలపుముద్రిచేత గా
జ్యమ్మును జేయువారిదగు నాద్మతిఁ బ్రోత్సహానంబుచేత రూ
పమ్మును బొందు నీ సకలభావములున్ గడుఁ జంచలంబులై

ఇది వేయిమార్గములుగాఁ
గదలిక గల జగముయొక్క-కదలిక యే యూ
స్పదముగ నిజమును నెవ రెఱిఁ
గెదరో వ్యర్థప్రియత్నకృద్ధీశాలుల్

ఎచట మొదలుపెట్టి నచటు తా నెట్టిదో
తెలియ సులభముగను దేలిపోవు
పడినయట్టిచోటు విడిచి యూ రెల్లను
విడతలుగను బోయి వెదకినట్లు

ఇంతకు నేను చెప్పునది యేమి యనంగను నాత్మవస్తువున్
చింతనచేయ మోహమును జెందకు మెప్పుడు వారియందు వా
రింతకు మానవాభ్యుదయహేతుక లౌకికసౌఖ్యసంతతుల్
సంతనపెట్టఁ గన్గొనిన సాధనసంతతి వీడఁ బోకుమీ

వీరు కన్గొన్న సాధనవితతియెల్లఁ
బూర్వఋషు లెఱింగిన సౌఖ్యములును గలదు
ధనము కావలె వానిఁ బేదలకుఁ గూడ
నందుబాటున నుంచగా నద్ది యెట్లు

ఇది లక్షసూత్రముల ముడి
బ్రతుకనఁగా దార మొకఁడు వదలిన నైనన్
పదిలమ్ము చెడును జివికిన
పది వానికి నుట్టితెత్రింపఁ బాల్పడెద రహో

ఈశ్వరానుగ్రహముచేత నింతవరకు
మాకు భారతధర్మంబుమీఁద బుద్ధి
నిలచినది ధర్మ్మములు సుఖంబులఁ ద్యజింప
నేటికి గృహస్థులైనవా రెవరుగాని

పూవు పరిమళించుఁ బుట్టగానే యనం
గను బూర్వజన్మసంస్కారరేఖ
ఆ వాడ చిలుకయు నా వాడపలుకులే
పలుకు నన్నయది పెంపకపు గుణము
ఒకవిత్తు వేసిన నొకచెట్టు మొలచునా
యన్నది రక్తగుణాతిశయము
అకయ నింగువకట్టినట్టి గుడ్డ యనంగ
స్వల్పవిద్యాగంధపాటవంబు

ప్రకృతి యెంతటి యపరిహార్యంబొ చెప్ప
నీ మహావాక్యములు శాస్త్ర మింతకంటెఁ
జెప్ప దెక్కువ యన్నింటిఁ జేర్చి సాధు
మార్గమున నేగు టొకఁడే ధర్మంపుటిక॥

పడినచోటనే వెదకికోవలయు నన్న
మాట నిధనంబు మేల్స్వధర్మమున ననుట
అల స్వధర్మ మనంగఁ బైయర్థమెల్ల
నంచు వచియించిఁ 'సేన' పంపించె వారి

ఇది శత్రుసంపద్గ్రహణ మను
చతుర్థాననము

ఓం.

# శ్రీ వల్లీదేవసేనా విజయము

జగ మెల్ల దేవసేనా
నుగమై దైతేయకృత వినూతనసుఖముల్
తగ నూలుకొలిపి ముక్తికి
సుగమం బగు బ్రదుకుతెరువు శుద్ధపఱచుచున్

బ్రదుకుటకే యొక్క పరమార్థమైనట్టి
విద్యలోఁ బరమార్థవిద్య కలిపి
ధనముతోఁపాటు సత్యమ్మును ధర్మంబు
బ్రదుకుపద్ధతియందుఁ బాదుకొలిపి
నెఱి నందుబాటులోనికిఁదెచ్చి పేదవా
రికిఁగూడ దైతేయకృత సుఖములు
చెదలుపట్టించిన సిద్ధాంతములలోని
మేలిమియంతయుఁ గీలుకొలిపి

స్వర్గ ముఖమైన స్వర్గంబు సంతరింప
నాశ లుడిగినయట్టి దైత్యపతి యింక
మనకు లాభంబు లేదని చనియె నింత
కంటెను శత్రుశాసనమే లాభకారి యనుచు

తగినంత విశ్రాంతి ధాత్రీజనుల కెల్ల
చేకూర్ప యంత్రముల్ స్వీకరించి
భూప్రజ సోమరిపోతులు కానంత
వరకును యంత్రముల్ పరిహరించి
విశ్రాంతికాలాన విద్యాసమార్జనో
పాయంబు లన్నియుఁ బదిలపరచి
అల్పసంస్కారుల నల్పబుద్ధుల రాజ్య
పరిపాలనమునుండి బహిరవెట్టి

వ్యయములేకుండ ధారుణీప్రజ కెల్ల
నెల్ల యెడల విద్యాసార మెఱుఁగఁ జేసి
స్వర్గ ముఖమైన స్వర్గంబు సంతరింపఁ
దాను తనయూరి కేగెను దైత్యరాజు

పల్లెలతోడి సంబాధంబు చెడకుండ
నడవిలో నొక పల్లెయందు మనుచు
నడవి పూచినవేళ నాపూతపై సన్న
లేఁతవెన్నెల చెంగలించు వేళ

మలయాచలానిలంబులు దేవసేనాల
కంబుల వ్యాజాన కదలు వేళ
దైతేయజనిత బాధానివృత్తి సమాగ
తానందరేఖా విహారవేళ

స్వామి దేవసేనప్రక్కన కూర్చుండి
ఆమె సన్నపైటయందు నున్న
రెండుతేంట్లలోన నొండు గోటను మీట
సేనచేయి స్వామిచేయి కలిసె

అది చివురాకుబాకుదారహస్తమునందలి యల్లెత్రాటి తే
టి దరహాతోగ్రకాహళము రేవను టంగున మ్రోసెఁ గానలోఁ
గదలిక పుట్టె లేఁజివురుగగ్గురు దగ్గరనుండి శౌర్యమె
త్తి దెసలఁ గ్రమ్మె భావజుని తేజము మాసిన సర్వసేనలున్

ఆకసంబున వ్రాలి యొయ్యారముగను
తీయవెన్నెలదారాలు తీయుచుండి
చెక్కుటద్దాలపీడల చెలువు గూర్చి
చానయందమునఁ బొడిచెను చందమామ

ఇద్దఱును డస్సి నిదురించి యేదొ వేళ
మేలుకొని మేలుకొననట్టి వేళ స్వామి
లేత చెక్కిళ్ళమీఁద వల్లి యటంచు
నూదె వెచ్చనియూర్పు పాదుకొలిపి

మెలఁకువ వచ్చిరాని మొక మేలిసుఖంబగు నిద్ర మాగు క
న్నులఁబడి యూగులాడఁగ దనూగతమై యలసత్వ మొప్ప పో
పల నొకతేలు నంటఁబొడువంగనె వెంటనె దద్దరిల్లి వి
హ్వలగతి లేచినట్లు జలజాయతలోచన లేచి నిల్వఁగా

లలన విచాలనంబున మెలంకువవచ్చెను స్వామికిన్ సితో
త్పలనయనావిలోచనపదంబున నెఱ్ఱనిసంజ చూచి చిం
దులు సవరించుకొంచుఁ దన దోవతికొంగులు మూటకట్టి యం
జలిఁ బతి లేచిచూచెన యుషఃప్రతిరక్తిమ కాకపోవుటల్

తెల్లగా నిలుచున్నది పల్లికాదు
నెఱ్ఱగా నున్నయది తూర్పెఱుపు కాదు
తెలివివచ్చిన స్వామియు దేవసేన
పాదముల వ్రాలి యొకక్షమాపణను గోరె

తొలఁగి నిలంబడెన్ సజలతోయజలోచన స్వామి లేచి క
న్నుల నపరాధమంతయును నూల్కొన కంపన మందుచున్న దో
సిలి యిడి యాసనంబు చిఱుచెమ్మట పోయఁగ సేనచేతి వే
ళ్ళలు గొనుసాహసంబునకు లోగనిగుండయతోడి విట్లనెన్

తోయజపత్రసుందర మఘుద్రవలోచన! నిన్ను హేమ వ
ల్లీ యనఁబోయి పల్లి యనుకే యిట నా యొనరించు తప్పు త
న్వీ! ఘనదేమొ తోంటివలె నిప్పుడు నే బలవన్నిబద్ధ బా
హాయుతదేహఁ జేయుటకు నైనను జంకెదనే జగన్నుతా

ఎఱవాగు హారొన్న కను తా
మర మరలింతు నవనీతమానస! యసురే
శ్వరు తప్పు క్షమింతు హృదీ
శ్వరు తప్పు క్షమించలేవె సన్నుతినిధీ

ఎలుపుకంటియందు విలువు రే జంకించు
కేలుపూని నలుగు చేల బూని
చెమటబొట్టు లున్న చిబుకంబు పూని యో
చెలియ; నినుఁ బ్రసన్నఁ జేసికొందు

కనుగొని దేవసేనకడగంటను నీటిని గోటమీటి యు
ట్లనెఁ బ్రభు! లేదు నీదుదెస నల్పము దోసము దోసమెల్ల నా
దని యెద భర్త్రకై యడిగినప్పుడు బ్రిహ్మాసు శూరుఁ డంచు వా
యిని జనుదెంచె నక్కట మదేకమనస్కఁ డటంచుఁ గోరకౌ

మూఁడులోకములకు మూలకందంబైన
యత్తగారు కలుగ నమర గంగ
మరియు వచ్చె నింట మాగినగుణ మిది
తెలిసి తెలిసి నేన దిగితి నిందు

అందుకుఁ గాదుగాని ప్రభువా! నను నీ పవిమీఁద బొమ్మటం
చుం దితిజేంద్రి మాయ తొలచుంబనిమీఁద విదేమిన్యాయ మా
నందవికేతనాస్య యిది నమ్మఁగఁ జాలకపోతి నెవ్వరో
కొందఱు నాకుఁ జెప్పినను ఘోరముగా నిటు సేయుటుండునా

నే నేమొ లేచివచ్చిన
దానిన యనిపోదగు మఱియుఁ దగినవిధానన్
దానికి జరిగిన దండురు
నే నే మొగమునను దండ్రియింటికిఁ బోదున్

దితిసుతు శాకలందు ననుఁ దేఁకువఁజూచెను లోక మిప్పుడా
దితిసుతు బాధ లేనితఱి దేశము భోగపరంపరాత్వరా
మతి సుఖశాంతనీతి మృదుమార్గము పట్టదు పోయి కానలో
బ్రతికెద లోపలన్ నిను శివప్రతిరూపము వెల్గ జేయుచున్

ఇప్పటికి నైహికంబున నిప్పు పెట్టి
తకట వైరాగ్యమునకును సద్దు రాకు
మనుచుఁ జను సేనమార్గమునందుఁ దొలఁగ
స్వామి బహుదుఃఖభారవిషణ్ణుఁ డగుచు

ఆ వల్లి యెవ్వ రాయమ
సేవాభావంబుయొక్క స్థితి యెట్టిది తా
నో వెడలివచ్చి స్వామికి
నా వనిత సుఖంబుగూర్చునా యను చింతన్

ఆమె శబరకన్య యగుటచేఁ దా నేగి
సవరగూడెములకు జలజనేత
అచట లేదటంచు నఖిలపల్లీ పక్క-
ణముల కేగి గౌరవములఁ గొంచు

ఎల్లెడ వల్లిగొల్కు నుతు శే వినిపించెను వల్లి యిందిరా
వల్లి జగద్భ్రమార్ఘురిణి వంశెన శ్రీతనువిద్యుదాభ సం
పల్లలితాబ్జనేత్ర సుమహాసముపాత్తగమాప్రసాదితా
పల్లులితాఖిలప్రజ కృపామధుసారణి యంచునంగదన్

తొలి రక్షించిన మగ్గముల్ సకలవృత్తుల్ విద్యుదుద్యన్మహో
జ్జ్వల యంత్రాంబుల సాయమై బహుళవస్త్రంబుల్ పదార్థాళి బా
హులఁ బండించిన వెల్లెడన్ గొఱఁతలేకుండంగ విశ్రాంతివే
ళల భూమిప్రజ జ్ఞానవాపికల వాలాయంబు నోలాడుచున్

ఇంటింటం గన సేన, సేన పదసామీప్యంబునన్ వల్లియున్
జంటల్‌గాగను రమ్యచిత్రములు భాస్వద్వర్ణముల్ నిల్పి వా
ల్గంటుల్ శ్రీమధురాకృతుల్ తనకు సీఁగా మంగళారాత్రికల్
వెంటన్ వెంటనె వల్లిదేవి నుతులన్ వించున్ హాసనేత్రయై

ఏ బనిచేసినన్ దొలుత నిందుశిశూపమఫాలభాగ కా
ర్యాపతితంబగా శశికళాభరణున్ నుతియించి భక్తితో
నాపయి దేవసేన నుతులాడి యనంతర కార్యనిశ్చయ
వ్యాపృతబుద్ధియై యనుచు వల్లి జనంబులకు చెప్పఁ జెప్పఁగన్

కొంచెము మాత్సర్యమ్ము వ
హించిన సేనకును నామె శ్రీవల్లిన్ భ
క్త్యంచితఁ గనుగొనవలె నని
పించెన్ మదిమ్మదుగుగాఁగఁ బ్రీతి రహించన్

పనితంబేగతిఁ గూడు గుడ్డలకు లోపం బింత లేకుండఁ జే
సెను మున్ దాను ధరాజనాళికి మరిన్ శ్రీవల్లి సేతన్ వినూ
తన శాంతాకృతులం బ్రసన్నమతులన్ దత్త్వాత్ములం గాంచుచున్
జని తా వేయు పునాదిపైనను మహాసౌధంబు గన్నట్టులన్

పాలతుక వల్లి యొక్కనుతి బోదెలు కుల్యలు సన్నపంట కా
ల్వలు చిఱుతూములున్ నదులవంతెన లాపగ నాగు నాన క
ట్టలు పెనుతూములున్ జలవిడంబన లంతటఁ జేలుచున్న యో
రలబడి లక్షలాది యెకరాలకుఁ బాఱుదలల్ విచిత్రమై

నిరతంబు నెండలోఁ జరియించుటంజేసి
ముదురుతేలిన నల్లమోముతమ్మి
బహుదూరము దినమ్ము స్వారి చేయుట చేసి
కఠినీకృతంబైన కాయవల్లి
ఎల్లచోఁ బనులు చేయించుట కనువుగా
నధికారభావాబ్ధులైన కనులు
పనివడ్డచో సిద్ధపడుటకు వీలుగా
నొడల నత్తుకయున్న యుడుపు లొప్ప

పూని గజసారణీ వినిర్మాణ మొకటి
పర్యవేక్షించు చున్నట్టి వల్లిఁ జూచె
సర్వదేశంబు నచ్చటఁ జానయాజ్ఞ
చేతఁ బాలింపఁబడుచున్న చెలువు తోఁచె

బొమ్మలఁ గాన్పఁ గన్గొనినపోలిక చాలిక గుర్తుపట్టి యుం
దమ్ముగ నేత్రయుగ్మమున దర్పము వెంటనె మారిపోయి య
ప్రేమ్ముగ వచ్చి సేన పదపద్మములందున వ్రాలె వల్లి యా
ర్ద్రమ్మగు నేత్రముల్ సజలతామరసంబులఁ గ్రేణిసేయఁగన్

తిగిచి కౌగింటఁ బూనిన దేవసేన
కౌఁగిటనె పెల్లువినయంబు క్రమ్ముకొనుచు
ప్రేలుచుండిన చెల్లెలివిధము చూచి
విమలహృదయంబునన్ సేన వెన్నయయ్యె

ఈమె సన్యాసిని యామె సంసారిణి
కట్టినవంతెన కౌగిలింత
ఈమె దేశికమూర్తి యామెయు శిష్యురా
ల్పరమ విద్యాసంధి వారిపేర్మి
ఈమె పునాది తా నామె సౌధము భావ
ములు వారి వన్యోన్యపోషకములు
ఆమె తత్త్వము తన్మయత యీమె స్వర్గ ము
ర్త్యముల కూడలిసమాగమము వారి

దనఁగఁ జూచెడివారికి నబ్బురముగఁ
దోఁచె గుండియలందున దుడుకు తగ్గఁ
దూములం జెంగలించుచు దూఁకుచున్న
నీర మొక కొంతదూరాన నిలచి పాఱె

ఇది నిరంతరాభ్యుదయ మను
పం చ మా న న ము

ఓం.

# శ్రీ వల్లీ దేవసేనా విజయము

ఆమెయిఁ దారహీనలు సితాసితవర్ణసమాన వృత్తులున్
స్వామిని జేరఁగాఁ జనిరి ద్వాదశసామిని మీలితాక్షు ను
దామ ఋతుప్రభాశబలితప్రణయానతచారువక్త్రి ని
త్యామృతవృత్తిచే ననము నంచదహీనచలత్తనూచ్ఛవిన్

స్వామిని జూచినప్పటికి సారసలోచన లిద్దఱున్ మరే
మో మది పూర్వ మొక్కరుగ నుండియుఁ బోయిన దిద్ద ఱిద్దఱై
స్వామిని వేఱువేఱుగనె భావనచేసిరి వారియూహ రే
ఖామితమూర్తియై పతియుఁ గన్పడె మాఱ్పడి వారు చూడఁగన్

తలపయిఁ జిన్నిచంద్రునిఁ దాల్చిన సామికి బాజుబొందుగా
దెలి రుద్రాక్షపేరుగను దిన్నని పెంజెవితమ్మ రత్నకుం
డలముగ నాదిదేవు జఘనంబున జుట్టిన పట్టుపట్టగా
నలఘువు దేవసేననయనాబ్జములందున స్వామి కన్పడెన్

లీలగఁ జేయిమీఁదఁ బవళించిన స్వామికి మేల్తలాడగా
వీలుగ నెందునెం దొఁగపువెట్టక యుండెను సందు సందు ను
య్యాళల నూఁచు పట్టుపరపై కనిపించెను వల్లికంటికిన్
నీలకుమారమేఘ కమనీయతనూచ్ఛవియైన స్వామికిన్

స్వామి వారిని గాంచి యాశ్చర్యమందెఁ
జెలువ లిద్దఱకును నింత చెలిమికలిమిఁ
జెలిమి సాగుచునుండని సేన యప్పు
డంతకోపమ్ము నందుట యబ్బుర మని

ఈసును బాసి చెల్మిమెయి నిద్దఱు భార్యలు నుండఁజేసి యా
శ్వాసము బోధమైన రతిసౌఖ్యములోపము నెంచి గాఢచిం
తాసముపేతచిత్తమునఁ దామరసాక్షులఁ బల్కరింపకన్
లో సుడివొంద స్వామియుఁ దలోదరులున్ బతిచిత్తభీతలై

మరియు నిపుడు స్వామి యున్నన లందెను
వేళ కాదటంచు వెళ్ళుచుండ
స్వామి సేనజఘనవైభవం బారసి
యరిగి యామెచేల నాహరింప

వెనుదిరిగి చూచె వల్లియుఁ
గనుగొనలయందు నిప్పుకణములు సెదరన్
తన కనులు మొయిలులు జలెగా
తన నడకయు ఝుంఝుగాఁగఁ దా నడచి చనెన్

లలనయు రక్తి లేని కనులంగని స్వామిని దేవసేన కొంద
దలపడి స్వామి యొండు చిఱునవ్వున నాయమ చేల వీడెను
త్పలదళనేత్రయుం బతిపదద్వయి మ్రొక్కి ప్రశాంతవాహినీ
సలలిత సాధుయానమున సాగి చనన్ గిరిగహ్వరంబులన్

అకవచ శాంతిమైన కుసుమాయుధుపైని నరోష సేన కా
నకుఁ జని వాన లెండల దినంబులు సాగుతపంబు సేయుఁగా
సుకములకోర్కి లేనిదగు సుస్థితిఁ గన్నులు మూసి గుండెలో
వలి యొకమూర్తి కన్బొమలపై నిలిపెన్ ప్రహసత్త్వదాస్యమున్

ఆగతి దేవసేన చన నాత్మనిలీనుఁడు స్వామి శాంబర
స్త్రీగుణభావనా మధురచిత్తుఁడు నామెఁ బ్రసన్నుఁ జేసికోఁ
గా గణుతించి యామె వెదుకన్ బహుదేశము లేగ వల్లి తా
నేగినచోటి కేగక హృదీశ్వరు వేమొలయించుచుం జనెన్

ఏ యూరి కేగిన నా యూరఁ దమ పరి
శ్రమలను రక్షింప నమరిన దని
ఏ పొల మ్మేగిన నా పొలమ్మున వారి
సారణీపంక్తులు సాకిన దని
ఏ యేరు చూచిన నా యేటిపై సేతు
బంధమ్ములను జతపరచిన దని
ఏ కోన కేగిన నా కోనలో విద్యు
దుదితప్రణాళికల్ పొదపిన దని

వల్లి జగదేకరక్షణోత్ఫుల్లమతిని
జెప్పఁ జొచ్చిరి నాలుగు సీమలందు
నెచటి కేగిన నిప్పుడే యేగిన దని
వల్లి యనినను గాదు శ్రీవల్లి యండ్రు

అగ్ని భయంబు మాయఁగ శిలాగృహములు
కట్టించుటకుఁ బదకముల నెత్తె
నీటియెద్దడిపోవ నిలువులు త్రవ్వించె
బెట్టయూళ్ళలను వాపీచయంబు
సమయాన సుఖముగాఁ జనవిశాలమ్ముగా
బాటలన్నియును నేర్పాటుచేసె
మురికిపట్టణముల నిడుకువీథులను బా
లింపఁ గ్రొత్తవి ప్రణాళికలు వేసె

అధికముగ దైత్యపతి తనయాజ్ఞ నెఱపఁ
బెట్టిన విభేదములను మాన్పించె వల్లి
వివిధసృష్టిరహస్యముల్ విప్పి చెప్పి
చేకొను మనస్సులను విమలీకరించి

ఆగదఖ జీవులే సుఖియు నందఁగ కున్నవి క్షుత్పిపాస
యంగఖు దుఃఖముల్ సుఖము నందెద రందఱు స్త్రీగతస్పృహాలా
స్పందితవృత్తులే పయిని వ్యాధులు నాథులు [illegible] మృత్యువుల్
కొందఱ కుం[illegible] లేఁటవె కొందఱ కిచ్చె సమానధర్మముల్

మరియును జూడ మానవసమాజమునం దసమానధర్మముల్
నెఱయును సర్వదా కళలనేరుపులందు బలాబలంబులం
బరువడిఁ జిత్తవృత్తులను వచ్చెడి విద్యలయందు దానహం
కరణము స్వార్థముల్ జననికాయమునందుఁ బ్రవృత్తిహేతునై

కూర్మి సమానలక్షణము కోరి విచారణ చేసినన్ దనూ
ధర్మములందు భేదసముదాయము చింతనచేసినన్ మనో
ధర్మములందు రెండు నిరుదారులఁ జక్కఁగ నేర్పరించి యీ
మర్మము దాచ కేలవలె త్మ్మాపతి జీవిసుఖం బదైత్యుఁడై

పిడుగునకును బియ్యమునకు
నెడపక సమకూర్పరా దొకే మంత్రమ్ముల్
పిడుగడచును బియ్యమ్మొ
యొడలిసి రక్షించు మన సఖా! పిడుగుసుడీ!

బ్రిమయగఁజేసి యందఱును బైకివిరాగను జీవితావకా
శములు సమానమం చనినఁ జాలు నొకో యధికార మెల్ల ను
త్తము లనుకొన్నవారికె కదా సమకూడుట జీవితావకా
శములు సమానమం చని వెసం గికురించుట యేలా దీనులన్

కర్మ యున్నది జీవుఁడు కలఁడు తదను
గుణముగా సాగు సుఖదుఃఖకోటి జగతి
కడఁగి ప్రతివాఁడు మోక్షాధికారి కాడు
కడఁగి ప్రతివాఁడు రాజ్యాధికారి కాడు

చాతురిచే వివేకమున శాస్త్రమహార్థ నిగూఢవాక్య ని
క్లితము ని జగద్ధువనీతి సహస్రముఖంబులన్ బరి
స్ఫీతముగాఁగ నొక్క ముడివెట్టవలెన్ సహసా వినిర్ణయం
ఘాతతజీవకోటికి భయంకరమై యొసలారకుండఁగన్

ఈ మెయి త్రిదహాస్యముల నెన్ని జగంబున దైత్యబుద్ధి వ
ల్లీ మృదుగేహ వల్లి విమలీకృతముంబొనరించి భారత
శ్రీమతిలోని శాస్త్రు వివరించి ప్రజాఖిలజీవనంబు ధా
రా మృదు శాంత భావ మధురంబుగఁ దీర్చిన తీర్పు చూచుచున్

పతి తనకోసమై విగహ భావకృశుండయి వచ్చెడున్ స్పృహా
మతి యని వల్లికిం దెలిసి మానిని మానని మత్సరంబుచేఁ
బతికిస నందకుండఁ జను స్వామియు వల్లి పొనర్చు సత్క్రియా
తతి విని కాంచుచున్ విరహతాపము మున్మడిగా నెసంగఁగన్

ఒకయూరఁ గుండపోతఁలు
మొకములు ముక్కలును గనులు మూఁతవడ మహా
చికము లవి పెల్లు రేగిన
చకితాత్మయు వల్లి వదలఁజాలద యచటన్

ఆ జాలిగుండె బాలిక
పోఁజాలద యవటు వదలిపో దనుచుఁ ద్వారా
శ్రీజంఘాలుఁడు స్వామియు
వేఁజని కనె వల్లి హృదయపీఠిమల్లిన్

పరులకోసము దైన్యపడు భావమంతయు
కనుబొమ్మలందునఁ గందళింప
పరిచర్య సాధురూపము పొందినట్టుల
నడచుచున్నట్టి యంసంబు తెలుప
ఇల్లిల్లు తనకోసమే చూచుచున్నట్లు
కనులలోపలి వెల్గు కానిపింప
ఆత్మజీవితము సేవార్థ మన్నట్లుగా
నడికట్టు క్రొత్తచిహ్నమ్ము నెరప

సర్వమును దైవ మన్నట్టి సన్నయూహా
లేఁతచిన్నారి నవ్వుతూలిక రచింప
బహుశత ప్రార్థనాత్ముల పట్టు వల్లిఁ
గన్గొనియె స్వామి నిలచి యేకాగ్రమతిని

తా నెదురుపోయి వల్లికిఁ గానిపింపఁ
బెరిగి మరి యొక్కయింటఁ గన్పించె నేమి
యిప్పుడే వత్తు నంచు నే స్మృతివహించు
వల్లి యాననబింబంబు తెల్లపోయె

తన యపచారము స్మృతి వ
చ్చిన దుఃఖంబో జనంబు చెందిన యీ వ్యా
ధినిగూర్చినట్టి దిగులో
వనితామణి పరిహరించు వల్లభు నతని

అలఘుప్రీతుఁడు స్వామికూడఁ బ్రహ్మచర్యాభావముంబూనిన
ట్టుల నా వేసము వేసికొంచు నటు లిట్టుల్ పోవుచున్ దీనతా
చలితాస్యుం డయినట్లుగా నభినయించన్ వల్లి కన్గొంచుఁ జే
రలుకన్ భర్తనుఁ గూర్చి యిట్లనియె మర్యాదాకఠోరంబుగన్

మనుజుల కష్టముల్ దివిజమండలికిన్ బరిహాసపాత్రముల్
మనుజులుమాత్ర మా దివిజమండలి నెప్పుడు నాశ్రయింతు రే
మనియెద వన్న స్వామి చెలియా! పటుకోపము సంహరింపవే
వనులను దేవసేనయుఁ దపం బొనరించు ననుగ్రహింపవే

తమ యాహారవిహారముల్ శుచితకున్ దవ్వై దురాచార సం
ఘములై కొల్చినక్షుద్రదేవతలుగాఁ గ్రాంతామయుల్ భూప్రజల్
తమలో నున్న యనంతు నన్నెఱుఁగ రీ త్వచ్ఛాంతసేవాపరా
క్రమమున్ మెత్తురటంచు నవ్వి ప్రభువున్ బ్రాణచ్ఛటాభూతుఁడై

తన యోగవిద్యచేతను
జనముల దగు వ్యాధి మాన్చి జగతికి యోగా
సన విద్యయె వ్యాధివిరా
సనహేతు వటంచుఁ జూపి స్వామియుఁ జనఁగా

పతివెంటం జనె బాల బాలకదళీపత్రంబు చెక్కిళ్ళ సం
గతి లేకన్ గతిలేక తూలఁ, బతియుం గ్లై బూని యా చెక్కిళుల్
బతిమాలన్ బతిమాలిమిం బెరిగి యా పద్మాస్య సద్మాస్యముం
దతిగంభీరిమఁ జొచ్చె హెచ్చిన యసూయాభావపర్యాప్తయై

రే నమృతాంశువెన్నెలలు జిమ్మిన జొమ్మనఁ జిన్నియాసుఁ జ
మానిని వల్లి రేఁదొలిసమాగమమైన యనంతరంబునం
దూలిన కిన్క సెజ్జపయి నొత్తిలి మంచముపైఁ బల్లి నా
నూని శయించ జబ్బగొని యాచిన స్వామి విదల్చుకొంచునుఁ

శ్రమముగ నేడ్పుఁగొనికి డగఁ డగ కంటి యముంగుబిడ్డ యా
కమలవిశాలలోచన వాకాటపు వేనలిపూలచెండు వి
భ్రమమునఁ దూలి సెజ్జపయి రాలగ నూరుపుపుచ్చి యూర్ధ్వ దే
హమున నురంబు రాచికొన నామె జగాచిమ్మకంబు నెత్తునుఁ

నెలఁత గుంట గుంట నీళ్ళును త్రావితి
గాదె నిన్ను వెదుకఁగాను వచ్చి
మెఱసినట్టిచోట మెఱవక మెఱసితి
మెలత వేయియైన మిన్నులందు

నీకై మానుషభావముందితిఁగదే నీరేజపత్రేక్షణా
నీకై మానుషముఁ ద్యజించితగదే నీరేజపత్రేక్షణా
నీకై బూని దురామయంపుజనులఁ సేవించితిఁ వెజ్జనై
నాకై సుంత యనుగ్రహింపఁగదవే నాళీకకేళీదృశా!

ఓ సుకుమారచారువికచోత్పలలోచన! దేవసేన స
న్న్యాసిని యాదినుండియును నా డొక సితినపహించి యామెఁ గై
సేసితి నీపయిఁ సకలచేతము ప్రీతము నాకు నెన్నొ నె
న్నాళ్ళసముపుచ్చుకొ మ్మనెదవా! మొగ మిట్టులఁ ద్రిప్పి వత్తువా

అనుచు బలవంతముగఁ ద్రిప్ప నభిముఖముగఁ
జాన తనతల పతిరొమ్ములోన దూర్చెఁ
బతియుఁ జక్కిలిగింతల పడతి జఘన
కక్ష భాగంబులన్ గలగలలు తెచ్చె

పసునడిఁ గొంతసేపటికి బ్రీతియభావము మీఱఁగాఁ బ
స్పరమును వార లిద్దఱుఁ బ్రసంగము చేయుచు వల్లి ఝల్లనన్
దిరముగ మీ కుటుంబము యతిప్రజ మద్ది భయంబు నాకు నీ
చరణము లంటెదన్ బరవసంబున నన్నుఁ ద్యజించఁబోకు వే

అనిన స్వామి యిట్టు లనియె నో సీ! యాత్మ
నేను దేవసేన నైన విడువ
పడతి నిన్ను మేన వదలుదునే యంచుఁ
గౌగిలించుకొనియెఁ గమలనేత్రి

గంధర్వపోతె రెక్కలమీఁద నెగురుచు
దేవసేనానామతీర్థ మొకఁడు
భారతీయప్రజా వైరాగ్యభావంబు
పాలించుచుండె శోభాపయోధి
యసురసేనా మహాహంకార భావంబు
పటుఝుంకారమ్ము పారఁద్రోలి
కడఁగి పంచారించి కాలకంఠమహస్సు
నాత్మనీనమున షడాస్యదీప్తి

నిత్యబహిరంతరింద్రియ విగ్రహాత్త
పరిణత తపోనివేశ సంభార యగుచు
దినదినప్రాచ్య తేజోఽవధీరితాల్ప
తారకాంశుప్రతానవర్ధిష్ణు వగుచు

సాహస్రఫణామణాళి ను
నీహారస్నిగ్ధస్థితియు వల్లి నిజతేజస్సం
దోహమున వెలుఁగఁజేసెడు
దేహులకై తాఁ గుభృన్నదీ క్షేత్రాదుల్

ఇది ఐహికాముష్మిక సంపాదనము అను
ష ష్ఠా న న ము

శ్రీ వల్లీ దేవసేనా విజయ మను
శ్రీ కుమారాభ్యుదయము
సం పూ ర్ణ ము.